బీజాక్షర సంకేతములు

ఓం - ప్రణవము సృష్టికి మూలం

హ్రీం - శక్తి లేక మాయా బీజం

ఈం - మహామాయ

ఐం - వాగ్బీజం

క్లీం - మన్మధ బీజం

సౌః - సౌభాగ్య బీజం

ఆం - పాశబీజం

క్రోం - అంకుశము

హ్రాం - సూర్య బీజం

సోం, సః - చంద్ర బీజం

లం - ఇంద్ర బీజం, పృధివీ బీజం

వం - వరుణ బీజం,జల బీజం

రం - అగ్ని బీజం

హం - ఆకాశ బీజం, యమ బీజం

యం - వాయు బీజం

శం -ఈశాన్య బీజం, శాంతి బీజం

షం , క్షం - నిరృతి బీజము

సం - సోమ (కుబేర) బీజము

జూం - మృత్యుంజయ, కాలభైరవ బీజం

భం - భైరవబీజం

శ్రీం - లక్ష్మీబీజం

హ్సౌ - ప్రాసాద , హయగ్రీవబీజం

Kshourwm - నృసింహ బీజం

ఖేం - మారణబీజం

ఖట్ - సంహారబీజం

ఫట్ - అస్త్రబీజం

హుం - కవచబీజం

వషట్ వశీకరణముబీజం

వౌషట్ - ఆవేశబీజం

ష్ట్రీం - యమబీజం

ధూం - ధూమావతిబీజం

క్రీం - కాళీబీజం

గం - గణపతిబీజం

గ్లౌం - వారాహి,గణపతిబీజం

ఘే - గణపతిబీజం

త్రీం -తారా బీజం

స్త్రీం - తారాబీజం

హూం - కూర్చము,క్రోధము,ధేనువు

బ్లూం - సమ్మోహనము

ద్రాం -ద్రావణ, దత్తాత్రేయబీజం

ద్రీం - ఉద్దీపనం

దం - దత్తాత్రేయబీజం

అం - బ్రహ్మ బీజం

కం -బ్రహ్మబీజం

ఇం - నేత్రబీజం

ఉం - శ్రోత్రబీజం

హ్లీం - బగళాబీజం

గ్రీం - గణపతిబీజం

ఠ - స్థంభనము

హిలి - వశీకరణ,దేవతాభాషణం

కిలి కిలి - దేవతాభాషణం

చులు - బాధా నివారణ

హులు - బాధా నివారణ

మానవుడు ఈ లోకంలోని కర్మ వలన శరీరాన్ని పొందుతున్నాడు. ప్రారబ్ధ కర్మలను అనుభవిస్తూ మరల పాపపుణ్యాలు చేసి తిరిగి జన్మ పరంపరను పొందుతున్నాడు. ఇట్టి జన్మ పరంపరను విచ్చేదమొనర్చడానికి ఉపయోగపడు సాధనే 'జపం' అని శాస్త్రములు చెబుతున్నాయి.

'జప'మనగా 'జ'-జన్మ విచ్ఛేదనం చేయునది. 'ప' -పాపమును నశింపచేయునది అని అర్థం. ఈ విధంగా జన్మను పాపమును రెండింటిని నశింపచేయడం చేతనే దీనికి జపమని పేరు వచ్చింది. జపంలో చందోబద్ధమైన ఒకే భగవన్నామం కానీ, ప్రత్యేకమైన కొన్ని మంత్రాలను కానీ ఉచ్చరించడం జరుగుతుంది. మనసు చంచలమై అల్లకల్లోలంగా వున్నప్పుడు ఆ మనసును ఏకాగ్రపరచడానికి జపం ఉపయోగపడుతుంది. నిశ్చల మనస్సుతో నిర్మలంగా దైవంపై మనసును కేంద్రీకరించి తత్ మంత్ర దేవతామూర్తి గుణరూపాలను మనసులో ముద్రించుకుని జపించాలి.

జపాన్ని మూడు విధాలుగా చేయవచ్చు. ఒకటి వాచకము: మంత్ర బీజ వర్ణములను తన దగ్గర ఉన్నవారికి వినబడునట్టు ఉచ్చరించుతూ జపించడం. రెండవది ఉపాంశువు: తన దగ్గరున్న వారికి మంత్రోచ్చారణ శబ్దాలు వినపడకుండా ఉచ్చరిస్తూ కేవలం పెదవులను మాత్రమే కదలిస్తూ జపం చేయడం. మూడు మానసికము: పెదవులను నాలుకను కదల్చకుండా మనస్సులోనే మంత్రం జపించుట.

వాచిక జపయజ్ఞముకన్నా ఉపాంశు జప యజ్ఞము వందరెట్లు అధిక ఫలాన్ని కలిగిస్తుంది. ఉపాంశు జప యజ్ఞం కంటె మానసిక జపయజ్ఞం వెయ్యిరెట్లు అధిక ఫలాన్ని కలిగిస్తుంది. ముఖ్యంగా మంత్ర మహిమార్థములను క్షుణ్ణంగా తెలుసుకుని జపించడం, సగర్భ జపం అనీ, మిక్కిలి శ్రేష్ఠమైనదనీ చెబుతున్నారు.

జపాన్ని చేసి సిద్ధి పొంది ఉచ్ఛస్థితికి వచ్చిన మహాపురుషుల యొక్క ప్రతిరోమము మంత్రాన్ని ఉచ్చరించడాన్ని మనం గమనించవచ్చును. జపం వలన కలుగు స్పందనచే సాధకుని శరీరం అంతా ఒక విధమైన దివ్య తేజస్సుతో దీప్తి నొందుతుంది. ఇట్టి స్థితిలో సాధకుని శరీరం దైవభావంతో అంతర్లీనమై ఒకవిధమైన గగుర్పాటు కలిగి అనిర్వచనీయమైన అద్భుతానందాన్ని పొందును. అతనిలో దైవ ప్రేమ పూర్తిగా నిండి ఆధ్యాత్మిక శక్తిని పొందుతుంది. మరియు అనేక ఇతర సిద్ధులను కూడా పొందుతుంది.

అలాగే జపవిధానంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు.. మరీ మెల్లగా అక్షరం విడిచి అక్షరంగా జపం చేయరాదు. అలాగని వర్ణోచ్చారణ మిక్కిలి వేగంగాను చేయరాదు. సమాన వేగంతో ఆటంకాలు లేకుండా స్పష్టంగా ఉచ్చరించాలి. జపం చేసేటప్పుడు మనసును ఇతర భావాలనుండి మరిల్చి దైవం మీద మంత్రార్థం మీదే ధ్యాసవుంచి ప్రశాంతంగా, ఏకాంతంగా జపించాలి.

సాధ్యమైనంతవరకు మౌనంగా ఉండాలి. శాంత స్వభావంతో ఉంటు పెద్దలను, విజ్ఞులను గౌరవించాలి. పాప కర్మలను, పాప చింతనలను పూర్తిగా విడిచి ధర్మచింతనతో, ఆధ్యాత్మిక చింతనతో గడపవలెను. సాత్విక మితాహారాన్ని భుజించాలి. సదా ఇష్ట దేవతా స్తోత్రాల పఠనం, వినడం కీర్తనం చేయాలి. దైవంనందు జపం పట్ల పరిపూర్ణ విశ్వాసం

వుండడం అత్యంత ఆవశ్యకం. మానసిక జపానికి కాలనియమం లేదు. సాధకుని యొక్క అనుకూలత బట్టి ఎప్పుడైనా ప్రశాంతంగా చేసుకోవచ్చు. మంత్రార్థాన్ని, మంత్ర చైతన్యమును, యోని ముద్రను తెలుసుకోకుండా ఎన్నిసార్లు జపించినా నిష్ఫలం అవుతుంది. జపోచ్చారణలో మంత్రం బీజాక్షరాలు లోపించకూడదు. అలాలోపిస్తే జప ఫలం ఉండదు.

బీజ లోపం లేకుండా చైతన్యం కలిగి ఉండు మంత్రాలను జపించడం వల్లనే ఫలితం. సంధ్యా సమయాల్లో అష్టోత్తరాలు, సహస్రనామాలు జపించడం ఉత్తమం. ఒక దైవనామాన్నికానీ ఒకే మంత్రాన్ని గానీ జపిచడం వల్ల ఏకాగ్రత కుదిరి జపసాధన నిర్విఘ్నంగా సాగుతుంది.